సీ. మజ్జనకుండు సన్మాన్యగౌతమగోత్ర
మహితుండు భాస్కరమంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘులు కేతన
మల్లన సిద్ధనామాగ్ర్యవరుల
కూరిమితమ్ముండు గుంటూరివిభుఁడు కొ
మ్మనదండనాథుఁడు మధురకీర్తి
విస్తారస్ఫూర్తి దావస్తంబసూత్రప
విత్రశీలుఁడు సాంగవేదవేది

తే. యర్థిఁగల వచ్చి వాత్సల్య మతిశయిల్ల
నస్మదీయ ప్రణామంబు లాదరించి
తప్పి దీవించి కరుణార్ద్రదృష్టిఁజూచి
కొలమి నిట్టని యానతి యిచ్చె నాకు.

తిక్కన, తనను గూర్చిగాని, తనపూర్వులను గూర్చిగాని యీ గ్రంథములయందు విశేషముగాఁ జెప్పుకొనకుండుట యాత్మశ్లాఘనముగా నిష్టము లేకపోవుటయో, పూర్వగ్రంథములయందు వర్ణించియుండి మరల మాటిమాటికిఁ జెప్పుకొనుట రుచింపకయో యైయుండును. ఇప్పటివారికి లెక్క యానాటి మహాకవులకు, స్వవిషయకథనమునం దిష్టముండెడిది కాదు. నన్నయభట్టు తండ్రిపేరైనను గృహనామము నైనను జెప్పుకొనలేదు.

ఇతని గృహనామము: నివాసము:

తిక్కన తన గృహనామము నెచ్చటను జెప్పుకొని యుండలేదు. కేతనకవి రచించిన దశకుమారచరిత్రమువలన వీరియింటిపేరు కొట్టరువువారని తెలియంగనగుచున్నది. మొట్టమొదట వీరి గృహనామము గుంటూరువారనియుఁ బిమ్మట కొట్టరువుగా మారెననియు నందురు. తిక్కన పూర్వుల నివాసము గుంటూరుమండలములోని

పడుగుపాడనియుఁ గొన్ని తరములయిన పిమ్మట గుంటూరునకు వచ్చి యచ్చట నివాసమేర్పరచుకొనిరనియుఁ దిక్కన పితామహుని జీవిత కాలమునందో, కాక యాతని తండ్రుల కాలముననో నెల్లూరునకు వచ్చి యట నివాసమేర్పరచుకొనిరనియు చెప్పుచున్నారు. తిక్కన నెల్లూరు నివాసి యనుట నిర్వివాద విషయము. తండ్రిని గుంటూరు విభుఁడనుటచేత తండ్రినివాసము గుంటూరనియే చెప్పవలెను.

కొన్ని శాసనములలో కోష్ఠాధిపతి యను సంస్కృత శబ్దమునకు తెలుఁగున కొట్టారువు అని వ్రాసియున్నారు. ఇట్లే భాండాగారాధిపతులకు భండారువు అని యుపయోగించియున్నారు. తిక్కనవంశీయులలోఁ బూర్వు లెవరో రాజులొద్దనో కోష్ఠాధిపతులై యుండిరనియు నాకాలపు తెలుగుభాషనుఁబట్టి వారిని కొట్టారువు లని వాడియుండిరనియు దాని ననుసరించి యీవంశీయులకు "కొట్టరువు" అను నింటిపేరు వచ్చియుండునని యూహింపఁదగి యున్నది. ఈపే రెప్పుడు వచ్చెనో చెప్పుట కాధారములు లేవు.

కొట్టరువు అన నొక గ్రామ ముండెననియు దానినిబట్టి వీరి గృహనామ మేర్పడెననియుఁ గొందఱనుచున్నారు. కాని యది సత్యము కాదు. కొట్టరువు గ్రామ మెచ్చటనుండెనో వారు చెప్పలేదు. గుంటూరు నెల్లూరు మండలములలో కొట్టరువు లేదు.

దశకుమారచరిత్రమందలి తిక్కన ప్రశంస:

తిక్కనసోమయాజి, మూలఘటిక కేతనకవి రచించిన దశకుమార చరిత్రము నంకృతినందెను. అందుఁ దిక్కనగూర్చి యాకేతనకవి రచించిన పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁడనిన
వీఁ డనునాలుకకుఁ దొడవైనవాఁడు

చిత్తనిత్యస్థితశివుఁ డెవ్వఁడనిన
వీఁ డనశబ్దమున కర్థమైనవాఁడు
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁడనిన
వీఁ డని చెప్పఁదగుఁ బాత్రమైనవాఁడు
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁ డనిన
వీఁ డనిమాపుడు గుణియైనవాఁడు
మనమసిద్దిపేట సమస్తరాజ్య
భాగ్యధారియుఁ డఖిలరూపభావభవుఁడు
కొండరావు కొమ్మనామాత్యమూర్తిసుతుఁడు
దీన జనతావిధానంబు తక్కటౌరి.

క. అగు ననఁ గొమ్మాభాతికృఁడు
జగతి నపూర్వార్థశబ్దచాతుకవితమై
నెగడిన బాణోచ్ఛిష్టం
జగత్త్రియం బనిపలుకు సఫలం బయ్యెన్.

క. కృతులు రచియింప సుకవుల
కృతులొప్పఁ గొవంగ నారసికిం దీరునె వా
కృతిశఖుఁడు వితరణశ్రీ
యుతుఁ డన్నమనుకుఁడు తిక్కఁ డొకనికిఁ దక్కన్.

సీ. సరసకవీంద్రుల పత్రములు ధనము లొప్పఁ
గొను నమలధికకీర్తనకుఁ దేశవు
లలిత నానాకావ్యములు చెప్పి యభయశా
పలమందు ననుట ప్రశంసత్రోవ
యర్థిమైఁ జెక్కుకృప నగ్రహారంబులఁ
గా నిచ్చు ననుట పొగడ్త పొలము

మహితశక్తిఁ గల్గెన బహువినయాంగంబు
లొనరించు ననుట పన్నము దారి
పరుని కొక్కరి కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజముగా నెంపు సాంసార నెగడునట్టి
కొమ్మనామాత్య తిక్కన కొలఁది సచివు
లింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు?

ఇతఁడు కేవల మంత్రియే గాక దండాధిపుఁడు కూడ నైనట్లు కేతన రచించిన యీక్రింది పద్యముల వలన స్పష్టమగు చున్నది.

క. శ్రీకరవరకవనాదూ
రీకరణనోదశుభచరిత్రుని ననుకం
పాకరహృదయుఁ గుణాబ్ధిసు
ధాకర శుభమూర్తిఁ దిక్కదండాధిపున్.

క. శ్రీవిలసద్రమణీయా
భావిశ్రీభవపాదపద్మ భావనిధానా
భూవినుత శుభచరిత్రా
ధీవిభవాత్తస్వరూప! తిక్కచమూపా!

కేతనకవి రచించిన యీపద్యములలో నతిశయోక్తి గాని యుత్ప్రేక్ష గాని లేదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఆధ్యాత్మికజ్ఞాన సంపన్నుఁడగు నీమహామహుఁడు తనవంశమున రాఁబోవువారల కైశ్వర్యమును సంపాదించి నిలుపయుంచవలయు నను కోరికగలవాఁడు కాఁడనుటకు నితని కుమారుఁ డొక చిన్న గ్రామమునకుఁ గరణ మైయుండె ననుటయే నిదర్శనము. ఇతఁడు తన శక్తి నంతయును ప్రభుకార్యనిర్వహణము నందు వినియోగించి చోడరాజ్యస్థాపనాచార్యుఁ డయ్యెను. ఇతని పాండిత్యము లోకశ్రేయమునకును, ఆంధ్రసాహిత్యాభివృద్ధికి నుప

యోగపరచి, యుద్గ్రంథరచనమును గావించుటయేగాక యనేకకవులకుఁ బండితులకుఁ బ్రోత్సాహ మొసంగియున్నవాఁడు. మారనవంటి మహాకవి యీతనికి శిష్యుఁడగుటయు కేతనవంటి పండితకవి కృతిదాతగావుటయు, బద్దెనవంటివాఁ డీతనిచే బిరుదమును గ్రహించుటయు నిందుకుఁ దార్కాణములు.

## హరిహరనాథుని ప్రశంస:

ఇతఁడు పరమ భక్తాగ్రేసరుఁడనుట కీతని రచనములే దృష్టాంతములు. ఇతనికాలమున వీరశైవవైష్ణవమతములు పరస్పర ద్వేషముతో నుండి యన్యోన్యహింసకూడ గావించుకొను స్వభావముతో మెలగుచు వచ్చినవి. అట్టిసమయమున నీమహానుభావుఁడు శివకేశవుల కభేదమును ప్రతిపాదించి, హరిహరనాథుఁడను దైవమునకు తనభారతముఁ గృతియిచ్చెను. నెల్లూరునందు హరిహరనాథ దేవాలయము ముండెననియు, తిక్కనసోమయాజి భారతము నాయాలయమునఁ బవిత్ర హృదయముతోఁ గూర్చుండి రచియించెననియు జెప్పుదురు. భారత విరాటపర్వ కృత్యాది యందలి "అభిపూజిత యాకృత్యంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు లోకమ్మారాధన విశేషం బగుటఁ జేసి" అనువాక్యము లీయంశమును ధ్రువపఱచుచున్నవి. ఈకృతిరచన మొకవిధమగు దేవతారాధన మనియే తిక్కన మనసార విశ్వసించెను, ఈతనితరువాతికవులు కొందఱీతని ననుకరించి తమ గ్రంథములను హరిహరనాథునకు గృతినొసంగిరి. నెల్లూరున నిప్పుడీయాలయము లేదు. పాండవుల యాలయ మొకటి కలదు. ఇప్పుడు రంగనాథస్వామి యాలయమున్నచోటనే పూర్వము హరిహరనాథుని యాలయ ముండెడిదనియు నది శిథిలమైపోఁగా నాప్రదేశమున రంగనాథాలయమును నిర్మించిరనియు జెప్పుదురు. నెల్లూరుకడ పెన్న రెండు పాయలై యుండెననియు, రెండవపాయ నెల్లూరునకు దక్షిణమున నుండెడి

దగరయు. నదియొడ్డున పూడిపోయినదనియు, వాపాయుటు దక్షిణపు టొడ్డున హరిహరనాథ దేవాలయ ముండెడిదనియు దాని శిథిల చిహ్నము లిప్పుడును గన్పడుచున్నవనియు కొందఱనియెదరు. బైచరాజు వెంకటనాథకవి తన పంచతంత్రము నీ హరిహరనాథునకుఁ గృతి యిచ్చియుండుటచే నాతని కాలము వఱకును (పదునైదవశతాబ్ది) యీయాలయ ముండెనని విశ్వసింపవచ్చును. సప్తగోదావరీ సంగమమున నొక హరిహరదేవాలయ ముండెడిదని ద్రాక్షారామమునందలి యొకశాసనము (పదుకొండవశతాబ్దినాఁటిది. ద. హిం. శా. సం. ౪ సంఖ్య ౧౦౪౯) వలనఁ దెలియుచున్నది. హరిహరనామక పట్టణమొండు కర్ణాట దేశమునఁ గలదు.

హరిహరనాథునిఁ బ్రశంసించుచు తిక్కనరచించిన యీక్రింది శ్లోక మాదేవునకుఁ బరమప్రీతిఁ గల్గించెనఁట!

"కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిమువా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే."

"ప్రభో! నీవు అలంకరించుకొనుటకొ అస్థిమాల నిచ్ఛయింతువా లేక కౌస్తుభము నభిలషింతువా? నీకు కాలకూటము రుచ్యముగా నుండునా? లేక యశోదా స్తన్యము రుచ్యముగా నుండునా నాకుఁ జెప్పుము" ఇది పైశ్లోకార్థము.

భగవంతుడు స్వప్నమునఁ బ్రత్యక్షమై శివకేశవుల కభేదమునుఁ బ్రతిపాదించుచు గ్రంథమును రచించినందునకుఁ దనమెఁ గొనియాడు చున్నట్లీక్రింది పద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.

ఉ. వైదికమార్గనిష్ఠ మగు వర్తనముం దగ నిర్వహించుచు
గేహము లేనిభక్తి మతి నిర్మలవృత్తిగఁ జేయుచుండ మ

తాపదవిరంగద్రజతశ్వేతభావము కల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యాసమున్ గొనియాడుచునుందు నెప్పుడున్.

స్వప్నసాక్షాత్కారకథఁ జెప్పిన వారిలో మొదటివాఁడు తిక్కనసోమయాజి. తనువారివలె పెక్కురీతుల ననుకరించి తమ గ్రంథములలోఁ దమపూర్వులలో, తమారాధించెడి దేవతలో స్వప్నమునఁ బ్రత్యక్షమైనట్లు వ్రాసికొనుచు వచ్చిరి. కొందఱ తిదియొక యాచారముగాఁ బరిగణించి యట్లు చెప్పికొనియుందురని తలంచినను దిక్కనసోమయాజివంటి ధర్మాగ్రగణ్యున కీశ్వరసాక్షాత్కారము గల్గె నని యూహించుటయే సమంజసము. పరమహంస రామకృష్ణునకుఁ గాళికాదేవి ప్రత్యక్షమగుచుండెడిదని చెప్పుటయు నది సత్యమని విశ్వసించుటయు నీయిరువదియవ శతాబ్దియందలి సంగతులు. మానవునకుఁ బరమేశ్వరసాక్షాత్కారము సంభవమని యీకాలమునఁ గొందఱి విశ్వాసము. కాని యది యీ ప్రస్తుత విషయము కాఁజాలదు.

హరిహరనాథుఁడు తిక్కన హృదయమున నిర్మించుకొనిన దేవుఁడే కాని యన్యాపేక్షరూపుఁడు కాఁడని కొందరిమతము. అది సత్యము కాదు. హరిహరనాథాలయములు పూర్వకాలమున నప్పటప్పట నుండెడివనుటకు శాసనదృష్టాంతములు కలవు. ఆయాలయము నందలి యేకవిగ్రహమున హరిహరరూపములు రెండునుఁ గనపడునట్లు చెక్కబడియుండెడివని చెప్పుదురు. తూర్పుగోదావరిమండలమున రాజోలుతాలూకాలో కేశవస్వామి యాలయమున నెదుటిప్రక్క కేశవరూపమును వెనుకప్రక్క స్త్రీరూపమును మలచియున్నవి. శ్రీమహావిష్ణువు మోహినీరూపమున శివుని వంచించినకథను సూచించుటకై యీవిగ్రహమును నిర్మించిరని యచ్చటివారు చెప్పుచుందురు. కావున హరిహరనాథుఁడు కేవలమానసికారాధనకొఱకుఁ గల్పించు

గానివాఁడె కాక యర్వాచీనరూపుఁడుగాఁగూడ నున్నాఁడని విశ్వసింపవచ్చును

తిక్కనసోమయాజి నిర్వచనోత్తరరామాయణమును రచియించు నాఁటికి బూర్వమే తలిదండ్రులిరువురును స్వర్గము నలంకరించియుండిరని చెప్పుదురు దీనినిబట్టి యీతఁడు బాల్యముననే మాతాపితృహీనుడయ్యెననియుఁ బినతండ్రిచే పెంపబడి విద్యల నభ్యసించి సర్వకళల బరిపూర్ణుఁడయ్యెననియు నెంచదగియున్నది.

తిక్కన యజ్ఞకథ:

తిక్కనామాత్యుఁడు రాజకార్యములలో నిమగ్నుఁడై యున్నను బ్రాహ్మణోచితములగు వైదికకర్మల నుపేక్షింపలేదు. నిర్వచనోత్తర రామాయణగద్యయందు "బుధారాధనవిధేయ తిక్కనామాత్యధేయ" యనియు, భారతగద్యయందు "బుధారాధనవిరాజితిక్కనసోమయాజి" యనియుఁ దెలుపుకొనియుండుటచే నీతఁడు నిర్వచనోత్తరరామాయణ రచనమునకుఁ దరువాతను, భారతరచనకుఁ బూర్వమునను యజ్ఞము చేసెననుట స్పష్టము. కేతనకవి దశకుమారచరిత్రమునఁ దిక్కననువర్ణించుచు "మహితదక్షిణులైన వివిధయాగంబు లొనరించుననుట వర్ణనము దాగి" యని చెప్పుటచే దశకుమారచరిత్రముఁ గృతినొందుటకుఁ బూర్వమే యీతఁడు యజ్ఞమును జేసియుండునని కొందఱనుచున్నారు. అదిసత్యమైనచోఁ గేతనకవి యొచ్చటనైనను తిక్కన నామాంతమున నీతఁడు యజ్ఞకర్త యని సూచించుపదమును వేయకుండ నుండఁడు. అట్టి పద మేదియు దశకుమారచరిత్రమున లేదు కావున నా యూహయందు సత్యములేదని తేలవలసియున్నది. కేతన చెప్పినదానికి వైశ్వదేవాదియాగము లని యర్థము చెప్పవలసియుండును మనుమసిద్ధి చనిపోయినపిదప భారతరచనారంభమునకుఁ బూర్వమీతఁడు యజ్ఞ మొనర్చియుండునని నా యభిప్రాయము.

నన్నయభట్టు రచింపగా మిగిలినభాగమును పూర్తిచేయించుటకై తగినకవికొఱకు రాజరాజనరేంద్రుఁడు ప్రయత్నముచేయుచు, నన్నయ రచనమునందలి తుదిపద్యమగు:

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభముఁ దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబులై"

యనుపద్యము నొకతాళపత్రముపై వ్రాయించి యిట్లు వ్రాయఁగలిగిన కవు లెవరైననున్నచో నీభావమును దమశైలిలో రచించి పంపుఁడని రాజాస్థానములకుఁ బంపెననియు, నది మనుమసిద్ధికడకు రాఁగా, దిక్కనసోమయాజి యాపద్యముననే కేతకీపత్రముపై వ్రాసియిచ్చెననియు, నన్నయతో సమానముగా దాను వ్రాయఁగలనను తిక్కనభావమును గ్రహించి రాజరాజాతనిని తనకడకుఁ బంపుమని మనుమసిద్ధిఁ గోరె. నంతయుఁ దిక్కన యందుల కంగీకరింపకపోఁగా మనుమసిద్ధికి గోపము వచ్చి "పలువురిలో నీబుఱ్ఱ గొఱిగించి వీధులవెంటఁ ద్రిప్పి మాంసమును దినిపించెద" నని తూలనాడెననియుఁ దరువాతఁ రాజు పశ్చాత్తప్తుఁడై తనమాట నిలుపుకొనుటకై తిక్కనామాత్యునిచే యజ్ఞము చేయించె ననియు నొకకథ చెప్పెదరు. కాని యింతలేశమాత్రమును సత్యము లేదు. (యజ్ఞము చేయువానికి క్షౌరమును, నూరేగుటయు, సోమపానమును గర్తవ్యములు)

మనుమసిద్ధిమహారాజు రాజరాజునకుఁ దరువాత రెండువందల సంవత్సరములలో నున్నవాఁడు. భారతమును బూర్తిచేయించుటకై రాజరాజు ప్రయత్నించెననుటకు గూడ నాధారములు లేవు. భారతమును దనకుఁ గృతియిమ్మని మనుమసిద్ధి యడిగెననియుఁ దిక్కనయందుల కంగీకరింపకపోఁగాఁ బైనిజెప్పినకథ నడచెననియుఁ గొందఱందురు.

కాని యెందును సత్యము లేదు. తిక్కన భారతమును రచించువాఁటికి, మనుమసిద్ధి జీవించియుండెనో లేదో యని సంశయముగా నున్నది. భారతమును భగవంతునకుఁ గృతి యియ్యఁదలఁచినప్పు డందుల కభ్యంతరము గలుగఁజేయు స్వభావము కలవాఁడు కాఁడు మనుమసిద్ధి. తిక్కన యెడల మనుమసిద్ధికి గౌరవ మెక్కుడు. శ్రీకృష్ణదేవరాయలు తన మంత్రియైన తిమ్మరసును "అప్పాజీ" యని పిలచినట్లే మనుమసిద్ధి తిక్కనను 'మామా' యని పిలుచుచుండెడివాఁడు. మనుమసిద్ధి తిక్కనయందుఁ గల యనన్యగౌరవము నిర్వచనోత్తర రామాయణము నందలి యీ క్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

చ. హరిహరపద్మగర్భులను నాదికవీంద్రుల నూత్నసత్కవీ
    శ్వరులను భక్తిఁ గొల్చి తగ వారికృపం గవితావిలాస వి
    స్తర మహిమాయుఁ డైన నను సద్గుణోత్తమమూర్తి మన్మభూ
    వరుఁడు దగంగ రాఁ బిలిచి వారక మన్నన నాదరించుచున్.

క. ఏ నిన్ను మామ యనియెడు
    దీనికిఁ దగ నిమ్మ భారతీకన్యక నా
    కీవగ్వాఁద దగు దనినను
    భూనాయకుపల్కు చిత్తమున కింపగుచున్.

సీ. సకలలోకప్రదీపకుఁ డగు పద్మినీ
        మిత్రవంశమున జనించినవనియుఁ
    జూచిన మగలైనఁ జొక్కఁ బుట్టి సౌం
        దర్య సంపద సొంపుఁ దాల్చెననియు
    జనహృదయానందజనకమై నెగడిన
        చతురత లక్ష్మి నప్రతిముఁడనియు
    మెఱసి యెందొంటికి మిగుల శౌర్యత్యాగ
        విఖ్యాతకీర్తుల వెలసెననియు

వివిధవిద్యాపరిశ్రమవేది యనియు
సరసబహుమాన విరచనాశాలి యనియు
మర్త్యరూపధరుఁ డగుచున్న మనుమనృపతి
సుభగుఁ గావించుఁ దను సముత్సుకుఁడ నైతి.

మనుమసిద్ధి మహారాజు తిక్కనకు రాజచిహ్నములను నిచ్చి గౌర వించిన ట్లీక్రిందిపద్యమునఁ గేతనకవి చెప్పియున్నాఁడు.

గీ. అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జిగిలికిఁ బదములును
గంబగట్లు భూమిగానిక గాఁగఁ బెం
పెసఁగు రాచపదవులెల్లబడసె.

పైపద్యమునందు మనుమసిద్ధి వివిధవిద్యాపరిశ్రమవేది యనియు, సరసబహుమాన విరచనాశాలి యనియు చెప్పియున్నాఁడు. అట్టి వాఁడు తిక్కనను బంధుత్వప్రశంసాదెంపివసంచుబకుటిలు లేదు కావునఁ బైకథ యొంతమాత్రమును విశ్వసనీయము కాదు. కృతిలిఁ గన్యకతోఁ బోల్చిన వారిలోఁ దిక్కనయే మొదటివాఁడు. రాజరాజు పరీక్షార్థ మంపిన పద్యము పైనిచెప్పినది కాదనియు "నిందుమానంబు" అనుపద్య మనియు కొందఱందురు. మఱియొకటియని యింకఁ గొందఱందురు.

తిక్కనతిరువాతి నాతనివంశము :

తిక్కనసోమయాజికిఁ దరువాత నాతనికుమారుఁడు నెల్లూరువకు వడమట రెండుమూఁడు కోసుల దూరములో పినాకినీనదీతీర మందున్న పాటూరుగ్రామ కరణీకమును సంపాదించి యక్కడ నివాసమేర్పరచు కొనిరనియు నప్పటినుండియు వారు పాటూరివారని పిలువఁబడు చుండిరనియుఁ జెప్పుచున్నారు ఈవంశావళిని వర్ణించు రెండు సీస పద్యములను బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగా రాంధ్రకవుల చరిత్ర మున నుదాహరించియున్నారు. ఆ పద్యములివి :

సీ. భారతపర్వము లపదియేను వరుసగాఁ
దెనిఁగించె గుంటూరితిక్కయజ్వ
యామహాత్మునిపుత్రుఁడౌ కొమ్మనఘనుండు
కల్పించె బాటూరి కరణికంబు
వాకొమ్మనకుఁ గల్గె హరిహరామాత్యుండు
నెమ్మితో నతనికిఁ గొమ్మఘనుఁడు
దిహిణాల సతికిఁ గామన తిప్పన
యాగామనకు సోమయాహ్వయుండు
ఆఘనునకు వీరనామాత్యుఁడతనికి
సోమలింగమంత్రి యామహాత్ము
నకును సోమరాజనాముఁడు వీరవీర
ఘనుఁడనంగ సుతులు గలిగి రందు

సీ. సోమమంత్రికిఁ గల్గెసుతుఁడు పాపనమంత్రి
యతనికిఁ బీరన యామనుజుకుఁ
గూరిమి తనయులు గోపాలభద్రార్య
నరసింహమంత్రు లనంగ ముగురు
వారిలో నరసింహవరునకు శరభార్యుఁ
డును భాస్కరామాత్యుఁడు నరసింహ
ఘనుఁడనఁ బుత్రులు గలిగిరి మువ్వురు
వారిలో శరభార్యవర్యునకును
వీరఘనుఁడు గలిగె వేంకనామంత్రికి
శరభమంత్రివరుఁడు జనన మొంది
ప్రబలియున్నవాఁడు పాటూరిలోఁ దన
కులము వర్ధిలంగఁ గోమరు మీఱ.

ఇందులో మొదటిపద్యము పూర్వరచిత మనియు, రెండవ పద్యము శరభరాజు గారిచ్చిన వంశానుక్రమణికనుబట్టి బ్రహ్మశ్రీ శతఘంటము వెంకటరంగనాథశాస్త్రిగారు రచియించి రనియుఁ జెప్పుచు నీపద్యములను శరభరాజుగారు వీరేశలింగముపంతులు గారి కిచ్చిరఁట. పాటూరి కరణికమునుబట్టి వీరు పాటూరి వారైనారఁట.

కొందఱీవంశావళిని గూర్చి సంశయమును దెలుపుచున్నారు. తిక్కనసోమయాజి యుపయోగించిన గంటపుఁబర చాలకాలము వీరి యింట నుండెననియు నందుపై నొకప్రక్క సరస్వతి విగ్రహమును నొకప్రక్క విఘ్నేశ్వర విగ్రహమును జెక్కఁబడి యున్నవనియు బ్రతీతి కలదు, అది యిప్పుడున్నదో లేదో తెలియదు. బ్రం. శ్రీ వీరేశలింగ ముపంతులుగారీ వంశావళినిబట్టి తిక్కన కాలమును నిర్ణయింపయత్నించిరి. ఇప్పుడు శాసనప్రామాణ్యమున నీమహాకవి కాలము స్పష్టముగాఁ దెలియుచున్నది. కావున నందుల కీవంశావళితోఁ బనిలేదు. మడికిసింగనకుఁ బితామహుఁడైన యాహ్లాదమంత్రి తిక్కనసోమయాజి పౌత్రిని బరిణయమాడెనని సింగకవికృత వాసిష్ఠరామాయణములోఁ జెప్పఁబడి యున్నది.

ఆంధ్రభాష కీతఁడొనర్చిన సేవ :

ఆంధ్రభాషాభివృద్ధికై పాటుపడినవారిలోఁ దిక్కన యగ్రేసరుఁడు. నన్నయాదు లాంధ్రభాషలోఁ గావ్యములను రచించినను, వారి కావ్యములలో సంస్కృతపదము లధికమును, ఆంధ్రపదములు స్వల్పము గను నున్నవి. నన్నెచోడుఁడు, సోమనాథుఁడు మొదలగు శివకవులు తమ గ్రంథములలో దేశ్యపదముల నధికముగనుపయోగించి యాంధ్ర సాహిత్యాభివృద్ధికై యెక్కువగా పాటుపడి యుండిరి. తిక్కనసోమయాజి రెండు గ్రంథములను రచియించుటే కాక, యాకావ్యములలో

దేశీయపదములను జక్కఁగా సంస్కరించి యుపయోగించి, తన రచనముల నాంధ్రసాహిత్య గ్రంథములనుగాఁ జేసెను. ఆంధ్రాభ్యుదయరచయితలలోఁ దిక్కన యగ్రగణ్యుఁడని చెప్పనొప్పును. ఆంధ్రసాహిత్య పోషణమున నీతఁడు పడినశ్రమ యపారము. ఈతనిరచనములు రెండును సంస్కృతమున కాంధ్రీకరణములైనను, ఇతఁడు గొప్పసంస్కృతపండితుఁడైనను, నీతని కవిత్వమునందు "నన్నుపయోగింపుఁడు నన్ను కొనుఁడని సంస్కృతపదములు ముందునకువచ్చి యుఱ్ఱూతలూగించుచున్నను, నాంధ్రభాషాభివృద్ధియే మనమున నిడుకొని విశేషముగా జాతీయపదములనే యుపయోగించి, రసముప్పతిల్లునట్లు కావ్యరచన సాగించినవాఁడీమహాకవి. ఈతని కవిత్వమునందు సంస్కృతపదములున్నను నవి యతిమృదులములై సారూప్యంబు వాడుకొనుచుండునట్టివియుఁ "ఏవి సంస్కృతపదములా? జాతీయములా?" యని సంశయము గ్గించునట్టివియునై యున్నవి. ఈతఁడు తన రచనావిధానమునుసూచించుచు నిర్వచనోత్తర రామాయణమున:

ఉ. జాత్యముగాని నొప్పయినసంస్కృతమైయొప్పదఁ దొప్పు; వాక్యసాం
గత్యము సేయుచోనయిన గద్యములోనగఁ జెప్పుకట్టు; దా
గ్గత్యము దోఁపఁ బ్రాసము పరిహారము వేఱగునక్షరంబులన్
బ్రత్యయమరూప మంచునిడ; సూరుల కిద్ధి యొంపుఁ బెంపదే.

అనుపద్యము జెప్పి యారీతిగనె తన కావ్యములను విరచించినాఁడు. ఈసందర్భమునఁ దిక్కన కవిత్వవుసొంపు సూచుటకై కొన్నిపద్యముల నిట నుదాహరించుట యావశ్యకము కాకపోదు.

ఉ. నన్నుఁ బరాభవించి పదనంబునకుం జని కీచకుండు ము
న్నున్నతెఱంగు దప్పక సుఖోచితశయ్యను నిద్రసేయు నీ
కన్న మొగుడ్పుమాటలకుఁ గారణమెయ్యది భీమసేన! మీ
యన్న పరాక్రమంబు వలదన్ననొకో దయమాలి తక్కటా! (వి.వ)

క. ఆపదఁ గడవంబెట్టఁగ
నోపి శుభంబైనదాని నొదఁగూర్పుమయా
శ్రీపుష్పపునకుఁ బాంథు
తాప్రసాలుఁడు నిన్నుఁజూపి చనియెఁ మహాత్మా!

ఆ. కౌతుకుఁగాంచు రాచకూఁతు రెద్దాఁక
నట్టివికి ముదిత వైవసమయ
మొనవెఁ దడయ దింక నొప్పదు జనములు ఈ. ప.
నట్లుగాని వృషభ లనరు మిమ్ము

తే. పట్టపకలింటిపూర్ప్యాశవగిదిఁ గర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుఁగుచున్నవాఁడు
మాధవా! మం రథంబును మరలనిమ్ము
బ్రతికియుండిన శుభములు బడయవచ్చు. క. ప.

చ. కెరవును లాప్పుఁజేవయును వీరల కారయ నొక్కరూప దు
స్తర భుజశక్తి ధర్మజుఁడు శల్యుని రూపడగించి యివ్వసుం
ధరఁ గొనునొక్క నేఁడితనిఁ దా సమయించి సమస్తమేదినీ
శ్వరుఁడుగఁ జేయనోపు నొకొ శల్యుఁడు కౌరవరాజనందనుజా (శ ప)

ఉ. క్రూరుఁడు లోభియున్ శఠుఁడు గొండియుఁడున్ జడుడుం గృతఘ్నుఁ
[డుగా
నేరనివాఁడు బొంకరియు నిందకు నోర్చునతండుఁ బింకయుజా
ధీరత లేమి దుర్ణయ మతివ్యసనత్వము గల్గువారలుం
జేరువ నున్కి భూపతికిఁ జెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా! (శాం.ప)

సీ. దివియలోఁ బడుఁబుర్వు దివియదొత్తినవానిఁ
బాపంబు పొందునే! యోపి దున్ను
వాఁగేటి మొనఁ జచ్చు నానావిధప్రాణు
లన్నరుఁ బొందునే యఘము? వాడు

దనువను శ్రేణి విధాత్రివశమున నా
యువు దెగినట్టి జంతువులు వచ్చు
నేము సంపితిమని యెంచు కనియు నహం
కారంబు వారికిఁ గలుగ దట్లు

ఆ. గాన చూచె వారిఁ గల్మష మొందదు
పుణ్యపాపదూరు తబ్బుద్ధియాల
మనికి కుండు వాఁడె యనుహింసపోలె నై
యా ధీ ధర్మ మైనపథము వినుము. ఆ. వ.

ఉ. ఏను హితంబు సెప్ప వినఁడు లేని దురాచరణంబు లిమ్మెయిన్
మానవు రోగి చేఁదయినమందు భుజింపఁ దలంపఁడా కినం
గాని రుజాంగఁ డప్పటి వికారము గల్గునె యట్లపోలె నీ
వైన నికృష్టవృత్తిఫల మందితలంచెదు గాక పిమ్మటన్. ని.రా.

స్థాలీపులాకన్యాయముగ నీపద్యములఁ జూపితిని గ్రంథమంతయు నిట్లే యుండును. ఈతనికిఁ జూచి కొందఱు వాదు లిట్లే తమ గ్రంథముల యందు జాతీయపదముల నుంచి రచించుచు వచ్చిరి. కాని శ్రీనాథాది మహాకవులు కొందఱీ మార్గమును విడనాడి తమ కావ్యములను సంస్కృత పదజాలములతో నింపివైచిరి. సాంస్కృతిక దీర్ఘసమాసములతో గ్రంథములను రచించుటయే గొప్పతనమని తలంచినవారు కూడఁ గొందఱు గలరు. ఆంధ్రభాషలోఁ గావ్యరచనమును జేయఁదలఁచికొనినప్పుడు దేశీయపదములతోఁ బాత్రలోకమునకును వినువారికిని హృదయాహ్లాదమును గలుగఁజేయునట్లు రచియించుటయే గొప్పతనమగును గాని నిఘంటుసాహాయ్యముండినఁగాని యర్థముకాని గూఢసంస్కృత పద సమాసములతో నాంధ్రకావ్యమును రచించుట గొప్పతనము కాఁజాలదు. ఈసందర్భమున మొల్ల తన రామాయణమునఁ జెప్పిన

క. మును సంస్కృతంబు తెలుఁగుఁ
దెనిఁగించెడిచోట నేమి తెలియకయుండన్
దనవిశ్వమెఱయఁ గ్రమ్మఱ
ఘన మగు సంస్కృతముఁ జెప్పఁగా రుచియగునే.

ఆ. తేనెసోఁక నోరు తియ్యన యగురీతిఁ
దోన యర్థమెల్ల దోఁపకున్న
గూఢశబ్దతతిఁ గొల్లలాడవని రొల్ల
మూఁగ చెవుడు నాడు ముచ్చటగును

క. కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్పునది తెనుఁగునకున్
బొందై రుచియై వీనుల
విందై మతి కాఁకపించు విబుధులకెల్లన్.

అను పద్యములు స్ఫురణకు వచ్చుచున్నవి. తిక్కనసోమయాజి తన గ్రంథములయందుపయోగించిన దేశీయపదములు వేలకొలఁదిగనున్నవి. సంస్కృతపదముల విషయమున "బాణోచ్ఛిష్టం జగత్త్రయ"మ్మనెడు మాట దేశీయపదవిషయమున నీమహాకవికి వర్తించు ననుటకు సంశయము లేదు. ఈభావమును దశకుమార చరిత్రకృతికర్తయగు కేతన కవి "అగునన నొమ్మహాతిక్కఁడు" (ఈపద్యమును పైన దాహరించితిని.) అనుపద్యములో వ్యక్తీకరించి యున్నాఁడు.

ఇతని కవిత్వగుణము:

అద్వితీయ ప్రతిభావంతుఁడగు నీమహామహుని కవిత్వగుణమును జూపనెంచుట సూర్యుని కాగడాలోఁ జూపనెంచుట వంటిది. ఆంధ్ర కవులలో నీతనితో సమానులింకొకరులేరు. ఈతనికవిత్వ మింతగా సర్వజనాకర్షణీయ మగుటకుఁ గారణములు కొన్ని గలవు. అందు

మొదటిది:— ఈతఁడు చేపట్టిన కావ్యములయందలి యితివృత్తములు. ఆర్యులమగు మనకుఁ గల యితిహాసములలో శ్రేష్ఠములయినవి రెండు. భారతము, రామాయణము. ఈ కావ్యములు రెండింటి నితఁడు చేపట్టినాఁడు. "మణినావలయమ్ వలయేన మణి" యనునట్లు కవిత వలన కథయును కథచేఁ గవితయు శోభకెక్కును. వ్యాస వాల్మీకుల ప్రతిభ జగద్విదితముగుటచేఁ గాదా యీ కావ్యముల యందలి యితివృత్తములే తన కవితాశక్తిని ప్రదర్శించుటకుఁ దగిన కథ లితనికి లభించుట గొప్ప యదృష్టము.

రెండవది:— సంస్కృతము ఈతని కవితయందు పెద్దపెద్ద సంస్కృత సమాసము లుండవు. చిన్న చిన్న దేశ్యపదముల నే విశేషముగా నీతఁడుపయోగించును. ఏతావత నేపదముపయోగించిన రస మవ్వతిల్లునో యీతనికి బాగుగాఁ దెలియును. ఎచ్చట నైనం సంస్కృతసమాసము లున్నను, అవి మృదుపద సంయుతములై మనోహరముగా నుండును. వాని యర్థమును గ్రహించుటకై నిఘంటుకారముల యక్కరయుండదు.

మూఁడవది:— అర్థగాంభీర్యము. ఎంతచిన్నపదముల నుపయోగించినను వానిలోనెంతయో గాంభీర్యమగు నర్థ మిమిడియుండును. పాఠకుని శక్తికొలఁది నంతలి భావగాంభీర్యము విదితమగుచుండును.

నాల్గవది:— వ్యర్థపదరాహిత్యము. ఇతని కవిత్వమునందుఁ బాదపూరణమునకును యతిప్రాసల కొఱకును దెచ్చిపెట్టుకొనెడి పదము లుండవు. ఎచ్చటనైన స్వల్పముగా నట్టి పదము లున్నను నవి కేవలము పడికట్టురాళ్లుగా నుండక యవియుఁ గూడ నెంతయో కొంత తూకమును దెలుపునవిగానే యుండును.

ఐదవది:— పాత్రౌచిత్యము. కవిత్వ మెంతరసవంతముగ నున్నను, పాత్రపోషణము యుక్తముగ లేకున్నచో సహృదయుల కానందము కలు

గదు. భారతమున ప్రధానపాత్రములు రెండు ధర్మరాజును, ద్రౌపదియు. తిక్కన నీయిరువురను భారతమునఁ దుదికంటెఁ జక్కగా పోషించినాఁడు. ఈ విషయమున వ్యాసునికంటె నీతనిదే పై చెయ్యియైనది. ధర్మరాజుని రాజనీతిజ్ఞత, సమయోచితజ్ఞానము కార్యదీక్ష, ఇంద్రియనిగ్రహము, సత్యాగ్రహము, ఓర్పు మొదలగు గుణములను జూపుచు తిక్కన వ్రాసిన భాగముల నొక్కచోఁ జేర్చి చూపినచో, లోకమున కెంతయో మేలు కలుగునని నాయభిప్రాయము. భారతమందలి యితరపాత్రములనుగూడ నీతఁడు చక్కగా పరివర్ణించినాఁడు.

ఆఱవది:— భావప్రకటనము. తాను చెప్పఁదలఁచుకొనిన భావము పాఠకులకు స్పష్టముగాఁ దెలియునట్లు చిన్నచిన్న మాటలతో వ్రాయు నేర్పు కవిశేఖరున కలవడినట్లింకొకరి కలవడలేదు. ఇరువురువ్యక్తులు మాటలాడునప్పుడది పద్యరూపమున నున్నను దృశ్యప్రబంధములో వలె నెదురుగా గూర్చుండి మాటలాడుకొనుచున్నట్లేయుండి పాఠకులకెంతయో యానందము కలిగించుచుండును. పౌరాణికుల కట్టిసందర్భములలో నాభావమును దనమాటలతో శ్రోతలకు విప్పి చెప్పుట కవకాశము కలుగుచుండును. ఎంతజటిలమైనవిషయము నైనను చిన్నమాటలతో సులభముగా బోధపడునట్లు చెప్పుటలో నీతఁడు మిగుల నిపుణుఁడు.

ఏడవది:— రసపోషణము. సందర్భము ననుసరించి నవరసములను పాత్రలు తుఁ దనుభవించుటకుఁ దగిన యితివృత్తమును గల్పించుట యందును, ఆరస ముప్పతిల్లుపదముల నుపయోగించుట యందును రసపోషణమునందును నీతనికిఁ గల శక్తి యపారము.

ఎనిమిదవది:— లోకజ్ఞానపరిపూర్ణము. ఈ మహానుభావుఁడు కేవల పండితుఁడునుఁ గవియు నై గాక లోకజ్ఞానమెఱింగిన మహామేధావి.

శాస్త్రముల యందును గ్రంథముల యందును చెప్పఁబడినదియే గాక నిత్యమును ప్రపంచమున జరుగుచున్న విషయములను గ్రహించి యందలి మంచిచెడ్డ లెఱింగి లోకవ్యవహారము గాంచి, తన యనుభవజ్ఞానమును దన గ్రంథములయందు బ్రకటించిన మహాపురుషుఁడీతఁడు.

ఈ కారణములచే నీతని కవిత్వము పండితపామర జనానురంజకమై సర్వజనహృదయాకర్షణ మొనరించుచున్నది. వీని కుదాహరణములను జూప నెంచినచో నది యొక పెద్దగ్రంథమగును.

ఈతని యాంధ్రీకరణ విధానము :

ఈ మహాకవి భారతాంధ్రీకరణమును యథేచ్ఛగా సాగించినాఁడు కాని మక్కికిమక్కిగా చేయలేదు. ఇతఁడు విరాటోద్యోగ పర్వములలో మూలమందలికథను మాత్రము గైకొని తనయిష్టము వచ్చినట్లు పెంచియుఁ గుదించియుఁ బాత్రౌచిత్యము కొఱకును రసపోషణము కొఱకును చాలమార్పులఁ గావించి యాపర్వములను స్వతంత్ర గ్రంథ మనునట్లుగా రచించినాఁడు. భారతమునందు పాఠకులకును శ్రోతలకును నెక్కువయాహ్లాదమును గలిగించినవి, విరాటోద్యోగ పర్వములు. తిక్కనసోమయాజి తన లోకజ్ఞానమును, పాత్రౌచిత్యమును గనుపఱచి, యీరెండు పర్వములను రచించియుండెను. ఈతని యాంధ్రీకరణ విధానమును జూపుటకై యీపర్వములనుండి యే దృష్టాంతమును గైకొనుట సమంజసమని యట్లుచేసితిని.

కౌరవసభకు శ్రీకృష్ణుఁడు రాయబారము పోవనున్నప్పుడు ద్రౌపది శ్రీకృష్ణునితో నుడివిన వాక్యములను, సంస్కృతభారతము నుండియు, తిక్కనభారతమునుండియు నెత్తి యీక్రింద వ్రాయుచున్నాఁడను.

"సుతా ద్రుపదరాజస్య అసితాయతమూర్ధజా
సంపూజ్యసహదేవంచ సాత్యకించ మహారథమ్"
"భీమసేనంచ సంశాంతం దృష్ట్వా పరమదుర్మనాః
అశ్రుపూర్ణేక్షణా వాక్యమువాచేదం మనస్వినీ."
"విదితం తే మహాబాహో ధర్మజ్ఞ మధుసూదన
యథానికృతి మాస్థాయ భ్రంశితాః పాండవా స్సుఖాత్."
ధృతరాష్ట్రస్యపుత్రేణ సామాత్యేన జనార్దన
యథాచ సంజయో రాజా మంత్రం రహసి శ్రావితః"
"యుధిష్ఠిరేణ దాశార్హ తచ్చాపి విదితం తవ
యథోక్తః సంజయ శ్చైవ తచ్చ సర్వం శ్రుతం త్వయా."
"పంచనస్తు దదీయంతాం గ్రామా ఇతి మహాద్యుతే
అవిస్థలం వృకస్థలం మాకందీం వారణావతమ్."
"అవసానం మహాబాహో కిఞ్చిదేకంచ పంచమమ్
ఇతి దుర్యోధనోవాచ్య స్సుహృదశ్చాస్య కేశవ"
"నచాపి వ్యాకరో ద్వాక్యం శ్రుత్వా కృష్ణ సుయోధనః
యుధిష్ఠిరస్య దాశార్హ హ్రీమత స్సంధి మిచ్ఛతః"
"అప్రదానేన రాజ్యస్య యది కృష్ణ సుయోధనః
సంధి మిచ్ఛే న్న కర్తవ్య స్తత్ర గత్వా కథంచన."
"శక్ష్యంతి హి మహాబాహో పాండవా స్సృంజయై స్సహ
ధార్తరాష్ట్రబలం ఘోరం క్రుద్ధం ప్రతిసమాసితుమ్."
"నహి సామ్నా నదానేన శక్యోఽర్థ స్తేషు కశ్చన,
తస్మా త్తేషు నకర్తవ్యా కృపా తే మధుసూదన."
"సామ్నా దానేనవా కృష్ణ యేన శామ్యంతి శత్రవః
మోక్తవ్య స్తేషు దండ స్స్యాత్ జీవితం పరిరక్షతా."
"తస్మా త్తేషు మహాదండః క్షేప్తవ్యః క్షిప్ర మచ్యుత,
త్వయా చైవ మహాబాహో పాండవై స్సహసృంజయైః"

"ఏతత్సమం ధర్మ్యం పార్థానాం తవచైవ యశస్కరమ్
క్షత్రియాణాం భవేత్ కృష్ణ క్షత్రస్యచ సుఖావహమ్"
క్షత్రియేణహి హంతవ్యః క్షత్రియో లోభమాస్థితః
అక్షత్రియోవా దాశార్హ స్వధర్మ మనుతిష్ఠతా"
"అన్యత్ర బ్రాహ్మణా త్తాత సర్వపాపే ష్వవస్థితాత్,
గురుర్హి సర్వవర్ణానాం బ్రాహ్మణః ప్రసృతాగ్రభుక్" ।
"యథా వధ్యే భవే ద్దోషో వధ్యమానే జనార్దన
స వధ్యస్యా వధే దృష్ట ఇతి ధర్మవిదో విదుః"
"యథా త్వాం న స్పృశే దేష దోషః కృష్ణ తథా కురు,
పాండవైః సహ దాశార్హ సృంజయైస్సహ సైనికైః"
"పునరుక్తంచ వక్ష్యామి విస్రబ్ధేన జనార్దన,
కాను సీమంతినీ మాదృక్ పృథివ్యామస్తి కేశవ"
"సుతా ద్రుపదరాజస్య వేదిమధ్యా త్సముత్థితా,
ధృష్టద్యుమ్నస్య భగినీ తవ కృష్ణప్రియా సఖీ"
"ఆజమీఢ కులంప్రాప్తా స్నుషా పాండో ర్మహాత్మనః
మహిషీ పాండుపుత్రాణాం పంచేంద్ర సమవర్చసామ్."
"సుతా మే పంచభి ర్వీరైః పంచజాతా మహారథాః,
అభిమన్యు ర్యథా కృష్ణ తథా తే తవ ధర్మతః"
"సాహం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాం గతా,
పశ్యతాం పాండుపుత్రాణాం త్వయి జీవతి కేశవ."
"జీవత్సు పాండుపుత్రేషు పాంచాలే ష్వథ వృష్ణిషు,
దాసీభూతాస్మి పాపానాం సభామధ్యే వ్యవస్థితా."
"నిరమర్షే ష్వచేష్టేషు ప్రేక్షమాణేషు పాండుషు
పాహి మా మితి గోవింద మనసా చింతితోఽసి మే."

"యత్రమాం భగవాన్ బ్రహ్మా, శ్వశురో వాక్యమబ్రవీత్,
వరం వృణీష్వ పాంచాలి వరార్హాసి మతాసి మే."
"అదాసాః పాండవాః సంతు సరథాః సాయుధా ఇతి
మయోక్తే యత్ర నిర్ముక్తా వనవాసాయ కేశవ."
"ఏవంవిధానాం దుఃఖానా మభిజ్ఞోఽసి జనార్దన
త్రాయస్వ పుండరీకాక్ష సభృత్యజ్ఞాతి బాంధవాన్."
"నన్వహం కృష్ణ భీష్మస్య ధృతరాష్ట్రస్య చోభయోః
స్నుషా భవామి ధర్మేణ సాహం దాసీకృతా బలాత్."
"ధిక్పార్థస్య ధనుష్మత్తాం భీమసేనస్య ధిగ్బలమ్
యత్ర దుర్యోధనః కృష్ణ ముహూర్తమపి జీవతి"
"యది తేఽహ మనుగ్రాహ్యా యది తేఽస్తి కృపామయి,
ధార్తరాష్ట్రేషు వైకోపః సర్వః కృష్ణ విధీయతామ్."
వైశంపాయనః,
"ఇత్యుక్త్వా మృదుసంహారం వృజినాగ్రం సుదర్శనమ్
సునీల మసితాపాంగీ సర్వగంధాధివాసితమ్."
"సర్వలక్షణసంపన్నం మహాభుజగవర్చసమ్
కేశపక్షం వరారోహా గృహ్యసవ్యేన పాణినా."
"పద్మాక్షీ పుండరీకాక్ష ముపేత్య గజగామినీ,
అశ్రుపూర్ణేక్షణా కృష్ణా కృష్ణం వచన మబ్రవీత్"
"అయం తే పుండరీకాక్ష దుశ్శాసనకరోద్ధృతః
స్మర్తవ్యః సర్వకాలేషు పరేషాం సంధి మిచ్ఛతామ్"
"యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సంధికామకౌ.
పితా మే యోత్స్యతే వృద్ధః సహపుత్రై ర్మహారథైః"
"పంచ చైవ మహావీర్యాః పుత్రా మే మధుసూదన,
అభిమన్యుం పురస్కృత్య యోత్స్యంతే కురుభి స్సహ"

"దుశ్శాసనభుజం శ్యామం సంఛిన్నం పాంసుగుంఠితమ్,
యద్యహంతు నపశ్యామి కా శాంతిః హృదయస్య మే."
"త్రయోదశహి వర్షాణి ప్రతీక్షంత్యా గతా ని మే,
నిధాయ హృదయే మన్యుం ప్రదీప్తమివ పావకమ్"
"విదీర్యతే మే హృదయం భీమవాక్ఛల్యపీడితమ్,
యోఽయ మద్య మహాబాహు ర్ధర్మమే వానుపశ్యతి."
"ఇత్యుక్త్వా బాష్పసంఘేన కంఠేనాయతలోచనా.
రురోద కృష్ణా సోత్కంపం సస్వనం బాష్పగద్గదమ్."
"స్తనౌ పీనాయతశ్రోణీ సహితా వభివర్షతీ.
ద్రవీభూత మివాత్యుష్ణం ముంచతీ వారి నేత్రజమ్."

ఈ శ్లోకములయర్థము సులభగ్రాహ్యములగుటను, గ్రంథవిస్తర భీతిచేతను వీనికిఁ దెలుఁగు వ్రాయలేదు.

గీ. ధర్మనందనుపలుకులు దనదు హృదయ
తాప మొదవింప మోమున దైన్య మొంద
నున్న పాంచాలి యిట్లని యొయ్యఁబలికె
గనలి శౌరితో గద్గదకంఠి యగుచు.

ఉ. అంతలుచేసి పోనడచి యక్కట! సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె? ఇట్టి యూఱట మదిం బ్రియమందె యుధిష్ఠిరుండు దా
నంతన యూళు లేవుఁడి నైదు సుయోధను డిచ్చునొక్కొ? ఈ
కంటకృపావిహీనమతి వాఁడు నెచ్చునె యన్నదమ్ములన్!

చ. తనయునుపడ్డ యన్నములఁ దమ్మునిపైఁ గలయూర్మి పేర్మి నీ
జనపతి సైపనున్నె? యదిసక్కనః రాజ్యముపాలు లేక తీ
టున కొడబాటు గల్గిన, నేటుంగమి వెట్టరె? చాలదైరి వీ
రనరొకొ? నానలేమియుని యాడరె లోకమువారు కేశవా?

శా. పంపేదం గమోక్షితక్కువలు రూపింపంగ నేలా? విచా
రింపంగా వారికి మేలు సంధి యిమువారిం జూచినం దారు సా
ధింపం జాలరొ? కాక పోరఁ దగ మర్దింపం దలంపేని శం
కింపం బట్టోకో? వారు ప్రాజ్ఞులె? యేకీడైన సైరింపఁగన్.

ఉ. ఓటమి యొకింతయేనియు సుయోధను చిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే దురభిమానము? యొక్కుడుపూనుగాక, యు
చ్చాటన సంగరంబు లగుచాప్పులు ఘట్టన సైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురోకో? పోదరో? కానలనుండ నచ్యుతా!

ఉ. ఏటుంటి నావలన దింకను నీవును రాజధర్మముం
గానుచితంబు సూచి మనకార్యము, మీసుజనత్వముం జెడం
గా నొంకభంగి సేయక తగం గురువర్గముతోడి సంధి మీ
కైన తెఱంగునన్ వలచినట్లుల చేయుఁడు నేర్పు తేర్పఁగన్

ఉ. ఆఱడిలోకముగా, ఫలమునందుటయుగా, గని పెక్కునేరమిగా
మాఱటనోరిదానవయి మాటలు చిత్తమునందు నిల్పకే
గాఱులు ప్రేలెదగా వినుఁడు, కర్ణుము నెగ్గుము గాన నల్కమై
పీఱికిసైనమానిసికి వెండి వివేకము గల్గనెర్చునే.

చ. వరమునఁ బుట్టితిగా, భరతవంశముఁ జొచ్చితి, నందుఁ బాండుభూ
వరునకుఁ గోడలైతి, జనవంద్యులఁ బొందితి, నీతివిక్రమ
స్థిరు లగుపుత్రులం బడసితిన్, పహాజన్ముల ప్రాపుఁ గాంచితిగా
సరసిజనాభ! యిన్నిటఁ బ్రశస్తి నెక్కినదాన నెంతయున్.

వ. అట్లుంగాక,

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యము గౌరవముం దలిర్ప సం
భావన సేయు; దట్టినుఁ బంకజనాభ, యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై విమపొందినవేణి పట్టి యీ
డ్చెవురుఁ జూడఁగా సభను నీడ్చె! కులాంగన నిట్లొనర్తురే?

ఆ. క్షత్రవిక్రమంబుఁ గాల్పనే? యిట్లు
బిన్నములు వడిన ధర్మనందనులకు
నేను రాజరాజపీఠమునఁ గన్నారఁ
గానఁబడయ మైతి మేలఁ గృష్ణ?

ఉ. నెట్టన యిట్టియుల్క మదినిల్పితి రక్కసకొల్మిఁ జిచ్చిడిం
గట్టినయట్లు పెద్దనయును గాలము దీనికి వాటు వెన్నడుం
బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు గాఁచు నటితో
బుట్టవు నీవు, తేజమునఁ బొల్చిన భర్తలు గల్గనచ్యుతా!

వ. అనుచు ఎలుఁగు రాలువడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాక్రాంతచిత్తుం డయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు దుడువను, జెన్నలితవేణి ముడువనుం దగువారి నియోగించి యమ్మానినితో నిట్లనియె."

పై శ్లోకములను బద్యములను జదివి చూచినచో సంస్కృత భారతమునకుఁ దిక్కనసోమయాజి రచనము వన్నె వెట్టినదని తోఁపక మానదు. ఈ సందర్భమున శ్రీ కొ. లక్ష్మణరావు పంతులుగారు వ్రాసిన వాక్యములను దాహరించెదను. "తిక్కనకృతి భారతము సంస్కృతమహా భారతమునకు భాషాంతరీకరణ మని మనవారందరు అనుకొనుచున్నారు; కాని యిది గొప్పపొరపాటు ఇట్లనుకొనుట మనము తిక్కనయెడ నొకయపరాధము సేయుటయే. సంస్కృతభారతము బంగారపుముద్ద. ఆంధ్రభారతమా ముద్దలోనుండి కావలసినంత బంగారమును దీసికొని స్వర్ణకారుని బుద్ధివైభవముతోఁ జేయఁబడిన చక్కనిసువర్ణకమలము వంటిది. ఉభయభారతములలోని యీ భేదముఁ జూపి స్వర్ణకారుని బుద్ధివైభవము వెల్లడిచేయుటయే మా యుద్దేశము" విరాటోద్యోగ పర్వములందక్క తిక్కనభాగమును దిక్కన క్లుప్తము చేసినాఁడు.

పూర్వకాలమున విశేష రాజకార్యములలో నవసరము వచ్చినప్పుడు మహారాణులు కూడ సభలోనుండి చర్చలలోఁ బాల్గొనుచుండెడివారని యీకథవలన మనకుఁ దెలియుచున్నది. ఇట్టిసంప్రదాయము పురాణయుగములో నేకాదు. చారిత్రకయుగమునఁ గూడఁ గలదు. పదునొకండవ శతాబ్దిప్రాంతమున మనదేశముపైకి దండెత్తి వచ్చిన మహమ్మదీయులకు సాహాయ్య మొనర్చుచున్న జయచంద్ర మహారాజుపై యుద్ధముచేయఁ బోవుచు నాతనియల్లుఁడగు పృథ్వీరాజు చిత్తూరురాణాయైన సమరసింహుఁడు మొదలగు మహారాజులతో నాలోచించుటకై యొకసభను సమకూర్చెననియు, పృథ్వీరాజు వాజ్ఞానుసారముగ నాతని రాణియు జయచంద్రుని తనయయగు సంయుక్తాదేవి యాసభకువచ్చి సమరతంత్రములలోఁ బాల్గొని దేశమును సంరక్షణమునకై జయచంద్రునితోఁ బోరుసల్పుట యుచితమే యనియు నందుఁ దండ్రి ప్రాణములు పోయినను దానందులకుఁ జింతింపననియుఁ దెల్పి భర్త ప్రోత్సాహమునకుఁ దోడుపడియెననియు, నప్పుడాసభయందున్న చాందాభట్టుఅనుమహాకవి 'పృథ్వీరాయరాసా' యనుగ్రంథమున వ్రాసి యున్నాఁడు

తిక్కనమహాకవి రచించిన కావ్యములు :

తిక్కనసోమయాజి సంస్కృతాంధ్రములయందుఁ బెక్కు గ్రంథములను రచించినట్లు చెప్పుదురు. కాని రెండుగ్రంథములు మాత్రమే మనకిప్పుడు లభ్యము లగుచున్నవి. అందు మొదటిది నిర్వచనోత్తర రామాయణము. రెండవది శ్రీమహాభారతము.

నిర్వచనోత్తర రామాయణము

ఇది వాల్మీకిరామాయణములో సప్తమకాండమున కాంధ్రీకరణము. రావణవధానంతరము శ్రీరామచంద్రుఁ డయోధ్యయందు పట్టాభిషిక్తుఁడగుపిమ్మటను జరిగినకథకుఁ బూర్వరామాయణమని పేరు. ఇది

యాఱుకాండలుకలది. ఈయాఱుకాండములలోను జెప్పని రావణ జననాది పూర్వవృత్తాంతమును శ్రీరామపట్టాభిషేకానంతర సీతావనవాస కథయు కుశలవ జననాది కథలును నేడవకాండమున నున్నవి దీని కుత్తరరామాయణమని పేరు. దీని నీ యుభయకవిమిత్రుఁడు తెనిగించె ను గ్రంథమునఁ దెచ్చటను వచనము లేకుండ రచియించుటంజేసి దీనికి నిర్వచనోత్తరరామాయణమని పేరువచ్చినది. కవులు సాధారణము గాఁ గథాసందర్భమును గలుపు పట్టులయందును, వర్ణనలుఁ జేయుపట్టు లను వచనములను రచియించుచుందురు. అట్టివి లేకుండ నాభాగము లను గూడఁ బద్యములచేఁ బూరించిన సొంపుగ నుండునని తన యభి ప్రాయమును దిక్కన యీక్రింది పద్యములలో వ్యక్తీకరించినాఁడు.

క. వచనము లేకయ వర్ణన
రచియింపఁగఁ గొంతవచ్చుఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయముఁ బద్యములన పొం
దుచితంబుగఁ జెప్పు టార్యు లొప్పిద మనరే?

క. కలితపదవ్యాసక్తిప్రసం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలుగా
నాల సంధించిన విధంబు నమరఁగవలయున్.

ఇతఁడు పూర్వరామాయణమును విడచి యుత్తరరామాయణ మును దెనిఁగించుటకు గారణ మంతకుఁ బూర్వమే పూర్వరామాయణ మును భాస్కరుఁడాంధ్రీకరించియుండుటయే యనియు భాస్కరరామా యణమును రచించిన దీతని పితామహుఁడైన భాస్కరుఁడే యనియుఁ గొందఱనుచున్నారు. ఈసందర్భమునఁ దిక్కన రచించిన రెండుపద్య ముల నుదాహరించుచు వానినిగూర్చియు, భాస్కరరామాయణ కర్తృ త్వమునుగూర్చియు మంత్రిభాస్కరుని చారిత్రమున విపులముగాఁ

జరిగించియున్నాఁడను. ఆవిషయములను మరల నిటవ్రాయుట పునరుక్తి యని విడచితిని. తిక్కనసోమయాజి భారతాంధ్రీకరణమువలెనే నిర్వచనోత్తర రామాయణమును పంక్తికిఁబంక్తిగాఁ జేయక స్వేచ్ఛ గైకొని రచించియున్నాఁడు. నిర్వచనోత్తర రామాయణమును పదియాశ్వాసములుగా రచియించి తనప్రభువగు మనుమసిద్ధి మహారాజున కంకితముచేసెను. ఇందు నన్నయవలెనే యితఁడును తన గ్రంథము మొదల నాంధ్రపద్యమును వ్రాయక యీక్రింది సంస్కృత శ్లోకమును రచియించెను.

శ్లో॥ శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజాస్తమ్భే జగన్మఙ్గల
ప్రాసాదస్థితిభారభాజి దధతీ ప్రాసాదభఙ్గీశ్రియం
శృఙ్గాలోత్తమగణ్డభిత్తిషు మదవ్యాసఙ్గవశ్యాగ్మినాం
యా ముక్తేవ యతేతరాం వధులిహా మానన్దసాన్ద్రాస్థితిః॥

శ్రీమహాభారతము

వ్యాసవిరచితమైనసంస్కృతభారతమునందలిపదునెనిమిదిపర్వముల లోను నన్నయభట్టు ఆదిపర్వమును, సభాపర్వమును, అరణ్యపర్వమునఁ గొంతభాగము నాంధ్రీకరించెను.

తిక్కనసోమయాజి యరణ్యపర్వమునందలి తక్కిన భాగము నాంధ్రీకరింప వలసియుండఁగా దానిని విడచి విరాటపర్వాదిగాఁ బదునైదుపర్వముల నాంధ్రీకరించెను. తిక్కనరచించిన :

ఉ. ఆదరణీయపారవిదార్థగతిస్ఫురణంబు గల్గి యా
ష్టాదశపర్వనిర్వహణసంభృతిమై పెనుపొంపియుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుండు దొనర్చె మహాత్ముఁడు నన్నయభట్టు దక్షత౯

మ. హృదయాహ్లాదిచతుర్థమూర్తికథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వముల యుద్యోగాదులుం గూడఁగా

బదునేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టం రచియించు టొప్పు బుధపంక్తిం దోషంబు లేదారగన్.

అను పద్యములనుబట్టి యారణ్యపర్వము నన్నయభట్టు పూర్తిగనే రచించినట్లు కన్పట్టుచున్నది కాని సాక్ష్యమిందులకు వ్యతిరేకముగా నున్నది. ఈవిషయమునుగూర్చి యెఱ్ఱాప్రగ్గడచరిత్రమునఁ జర్చింపఁ దలంచి యిట వదలివైచితిని.

ఆంధ్రిలో కాళ్యాయనము గాంక్షించి, ఈమహాభారతనిర్మాణకార్యమునకుఁ దాను సంసిద్ధుఁడనైతినని యాకవిసార్వభౌముఁ డీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

"ఉ. శాసన భారతావ్యగము కర్ణపుటంబుల వారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయ సంస్కృతి
శ్రీభవాప్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్

పరిశాంతహృదయముతో భారతరచనకు దీక్షఁ గైకొనిన యా పుణ్యపురుషుఁడు తెలుఁగుభాషలో భారతమును రచియించుట "పురుషార్థతరుపక్వఫల"మని హరిహరనాథుఁడే రచియించిన ట్లీకవి యాక్రిందిపద్యములలోఁ దెలిపినాఁడు.

క. పారాశర్యనికృతి యయి
భారతమను పేరఁ బరగు పంచమవేదం
బారాధ్యము జనులకు ద
ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్

తే. తెనుఁగుబాస విరచింపఁ దివురు టరయ
భవ్యపురుషార్థతరుపక్వఫలము గాదె
దీని కెవ్వరియనుకొని వేడ్క నూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కనార్య!

ఆంధ్రభాషలో హృస్వము లగు కావ్యములను రచించినవారిలో దిక్కనసోమయాజిని మొదటివానినిగా నెన్నవచ్చును. ఇంతేకాదు, పరిమాణము నందుఁగూడ నీతనిలో సమానముగ గ్రంథరచనముగావిం చిన యాంధ్రకవు లింకొకరు లేరు. నిర్వచనోత్తర రామాయణమున దాదాపు ౧౩౦౦ పద్యములును, మహాభారతమునఁ బదునాలుగువేల గద్యపద్యములును గలవు ఈతని రచనములయం దేభాగమును దీసి చదివినను విసువు జనింపక యింకను జదువవలయు ననియే యుత్సాహ ము కలుగుచుండును.

## తిక్కన పద్యరచనము

కందపద్యరచనమునం దీతఁడు కడు నేర్పరి. మన దేశమున "పందిని బొడిచినవాఁడు బంటు, కందము చేసినవాఁడు కవి" యను లోకనానుడికలదు కందపద్యములను రచించుట కష్టతరమని దీనియభి ప్రాయము. కవిచౌడప్ప చెప్పినః

"క. ముందుగఁ జను దినములలో
కందమునకు సోమయాజి ఘనుఁడందురు నేఁ
డందఱు నను ఘనుఁడందురు
కందమునకుఁ గుందవరపు కవిచౌడప్పా"

అను పద్యమునుబట్టి పూర్వకాలమునఁ దిక్కనసోమయాజి కందములు మతి కెక్కినవని తెలియుచున్నది. ఇతఁడు కందపద్యములను విరసముగా రచియించుటేకాక సంఖ్యయందుగూడ వాని నధికముగా వ్రాసి యున్నాఁడు. దాదాపు ౧౩౦౦ పద్యములుగల నిర్వచనోత్తర రామా యణములో నైనువందల యిరువదిరెండు గందములున్నవి. భారతమునం దంతటి మొత్తము గద్యపద్యములు పదునాలుగువేలలోను మూడవభాగ మయిదువేల మూడువందలు కందపద్యములు. భాస్కరరామాయణము

న మల్లికార్జునభట్టు రచించిన భాగములో( గూడ మూటికి నలువదికి మించి కందపద్యములుకలవు. మల్లికార్జునభట్టు పేర(గల భాగములో( కాలభాగము మంత్రిభాస్కరు(డు రచించెనని యొకవాదముకలదు. ఆ వాదము సత్యమయ్యెనేని, తాతయు మనుమ(డును, కూరలును మంత్రులు, నగుటయందే కాక, కందపద్యరచనమున( గూడ నొకరి కొకరు దీసిపోక వంశమర్యాదను గాపాడిరని విదితమగును. విరాట పర్వాదియందు(జక్క( దిక్కనప్రతియాశ్వాసాదియందును దిక్కన కంద పద్యములనే వ్రాసియుండెను.

తిక్కనసోమయాజి సామాన్యముగా, శార్దూల మత్తేభాదిపద్యములనే గాని, కవిరాజవిరాజితాది వృత్తములను రచియించుటలో నేర్పరి కా(డని యెవ్వరో యాక్షేపించగా స్త్రీపర్వమున( గష్టపడి యాత(డు విశేషముగా వృత్తములను రచియించెనని కొందఱనుచున్నారు. స్త్రీపర్వమున వృత్తములు విశేషముగా నున్నమాట సత్యమే కాని, యెవరో యాక్షేపించిన మీ(దట వానిని రచించెననుట సత్యముండదు. స్త్రీపర్వమందలి కథ దుఃఖకరమైనది అందు స్త్రీపాత్రము లెక్కువగా పాల్గొని శోకపూరితములగు వాక్యములను బల్కుచుండుటగాననగును ఆకథ కనుకూలముగ నుండునని యావృత్తముల నాత(డు రచియించి యుండును. చంపకోత్పలములుగాని, మత్తేభశార్దూలములుగాని, స్త్రీ పర్వమున లేవు. దాదాపు నలువదివిధములగు నితరవృత్తము లిందు( గలవు.

ఈత(డు రచియించిన రెండుకావ్యములలోను, నిర్వచనోత్తర రామాయణకవిత్వముకంటె మహాభారతకవిత్వము రసవత్తరమై యారి తేరి హృదయంగమముగా నున్నది. నిర్వచనోత్తరరామాయణమున( గొన్నితావులలో నీతనికవిత్వము నారికేళపాకములో నున్నదని కొంద ఱందురు. కాని యది సత్యముకాదు.

ఈతని కవిత్వశైలి చూపుటకిదివఱ కుదాహరింపఁబడిన పద్యములే చాలియున్నవి. ఈతని పద్యములన్నియు, రసవంతములై యుండును. అట్టివానిలో మంచివని యేరియేర్పఱుట యసంభవము. అయినను, రామాయణమునుండి యాశ్వాసమున కొకటివంతున పదిపద్యములను, భారతమునుండి పర్వమున కొకటిచొప్పున పదునెనిమిదిపద్యముల నీదిగువ నుదాహరించుచున్నాఁడను. మెచ్చుచూపులలో మంచిచెడ్డలు రెండిటిని గూడఁ జూపుట ధర్మముకదా.

## నిర్వచనోత్తర రామాయణము:

చ. జనకునియజ్ఞవేదికఁ బ్రశస్తముగా జనియించి యంగనా
జనతకు భూషణం బనఁగ జాలిన సీతకు రుద్రచాపభం
జన మనుసుంకు విచ్చి నృపసత్తముసూతిఁ బరిగ్రహించి పే
ర్చిన యుభయానురాగమునఁ జిత్తభవుం జరితార్థుఁ జేయుచున్. ఆ౧

చ. వరములు గాంచి బాహుబలవంతుఁ డనం దగుసూర్యవంశుఁడ
య్యెరువగు విక్రమంబునఁ బ్రసిద్ధివహించి నిజానుజన్మలం
గర మనురక్తి నన్నఁ దగినం గొలియాడుచు సర్వలోకభీ
కరుఁడయి దేవతామునినికాయము దల్లడమందుచుండఁగన్. ఆ౨

చ. తనయుఁడు తండ్రియగ్రజుఁడు తమ్ముఁడనం జనునయ్య రాజ్యముల్
గొనునెడ శౌర్యలంపటులకున్ మఱి చుట్టఱికంబు గల్గునే
మను వగునంతకుం రిపుఁడు గ్రతఁ జైఁచిన నింక నూరకుం
డ నగునె వేగఁబోరికిఁ గడంగుము నీభుజదర్ప మేర్పడన్. ఆ౩

శా. కేలీకందుకవల్లి నెత్తుకొనుమాడ్కిం బట్టి నాయన్న యా
కైలాసాచల మిట్లు నీవు సొయంగా నెత్తితం జోద్యమై
లీలా వేగొనియాడు ప్రల్లదను వర్ణింపంగ నీకొక్క వే
రేలోకంబునఁ జెల్ల దైత్యులకుఁ బెంపేర్పడంగ నేనిచ్చెదన్. ఆ౪

చ. పరమపతివ్రతావితత భాసురలీల వెలుంగుచున్న ని
ష్కరుణతి విస్మయం బతిచేఁ గావున నీజనుఁడాధముండు స
త్పురుషపరిగ్రహం బయినపుణ్యసతిం గలుషింపఁజేసి త
ద్వరుని పరాక్రమంబున నవశ్యముమృత్యువుఁబొందుఁ గావుతన్. ౮౫

ఉ. వంచినకెంపుఁ బాసి దివిఁ బ్రాకి దిశల్ వెలిఁగించి చంద్రకాం
తంబుల నీరు సేసి కుముదంబులఁ బింకువు సేయఁ బంచి యా
బ్జంబుల నిద్రవుచ్చి మరుసాయకముల్ గరసానఁబట్టి కో
కంబుల నేఁచి లోకము పొగడ్తలు సేకొని చంద్రుఁడున్నతన్. ౮౬

శా. వాలిం గీటడఁచు వాయుపుత్త్రు సరియే వాఁడొక్కఁడే కిజ్ఞుఁడై
యీలోకంబులు గెల్తునే నవివ మా కెందుఁగలండే మహీ
పాలాగ్రేసర పాపవర్తనమఁ జెప్పం జెట్ట లావిక్రమ
శ్రీలోలున్ భవదీయసన్నిధిఁ బ్రశంసింపంగుఁ జెప్పదగన్. ౮౭

ఉ. రావణువింట నుండఁగ ధరాసుత నే మరలంగఁ దెచ్చి సం
భావన సేఁత కష్టమనిపల్కిరి చూచితె లక్ష్మణా? మహా
దేవుఁడు బ్రహ్మయున్ మునులు దేవగణంబులు మెచ్చ నయ్యెడం
బావకుఁ డిచ్చె నా సతిఁ బాపవుమాలలు పుట్టె నయ్యెడన్. ౮౮

మ. ఒకనారీతిలకంబు గానమున లోనుద్దామశోకార్తయై
వికలాలోకన మశ్రుధారలును బృథ్వీరేణులిప్తాంగముం
బ్రకటాక్రందనముం బికీర్ణకబరీభారంబు వక్త్రాబ్జశో
షకనిశ్వాసగమోహమ్మునుం గలయవస్థం బొందఁగా నయ్యెడన్. ౮౯

చ. జయజయశబ్దముల్ సెలఁగ సర్వజనంబు చెలర్ప నర్మిలిం
బియసుత యుగ్మముం దిగిచి పెద్దయుఁ బ్రొద్దొకఁ గౌఁగిలించి మో
దయుతమనస్కుఁడై నృపతి తమ్ముల సమ్మతిఁ బొందఁ జేసి య
వ్వ్యయపదవృద్ధి తిల్లుల మనం బలరం బ్రకటించి వేడుకన్. ౯౦

చ. దురమునఁ బెంపుఁ జేయుచు దుర్దమలీల వెలుంగుచుండ సు
స్థిరత శమాంగపంచక విశిష్టతలంబునఁ బోలి సద్గతిన్
బొరసెదు నీకునై వగవు పుట్టదు బంధులు రాజు దేవులున్
దిరియుదు రింక వారి దగుదీవన కోర్వక యుమ్మలించెదన్. సౌహ

మంగళమహాశ్రీ:

ఈతఁడు రణంబునకు నెత్తిచనుచుండి యును
నెంతయును భక్తిఁగని నాకుం
ప్రీతి యొసఁగం బలికె ప్రేమ మొలయం బొగడి
పెద్దయు వినీతిపరతుండై
చేతులు మొగిడ్చి జయసిద్ధియుఁగ దీవన వి
శిష్టనయ నిమ్మనిన ధర్మం
బేతల ననూనమగు విద్దెయు మగు మాతలకు
నెల్లయును సిద్ధముగు నంటిన్. స్త్రీ.హ

మ. విజదారైకపరత్వముం గరుణయున్ నిగ్రహంబుం దాల్మియున్
సుఃశాసంగము దేవపిత్రతిథి సంపద్ధార్చనల్ హవ్యము
గృహజనంబున్ సకలాశ్రమస్థులకు శక్యాశ్రయం బ్రోవుఁ బం
కజగర్భుండు గృహస్థధర్మములుగాఁ గల్పించె సర్వేశ్వరా. శాంప

చ. అంశనవిద్యఁ జేసి సురలాదిమునుల్ మహితానుభావులై
రనఘ సహస్రవర్షపమనంతరకల్పిత మైన యేకభు
క్తనియమతంత్రముల్ నడపి గాధిసనూజుఁడు బ్రాహ్మణత్వమున్
గనిరొ మహోపవాసములఁ గాని ఫలంబులు లేవు భూవరా. అప

ఉ. ఉత్తర బిక్షనెత్తుకొని యొయ్యన హా మలరంగ వచ్చి య
త్యుత్తమతేజుఁడైన పురుషోత్తము నంభ్రములపొంత భూస్థలిం
జిత్తమెలర్పఁగా దనదు చెన్నగు ఫాలము సోఁకవన్ ముదా
యుత్తమసన్ముఁడై యతఁడు సాదరభాషల గారవించుచున్. అప్ప

క. మాయయ్య కానవచ్చునె
కోసెదు సేవితనితోడఁ గోరెద నుత్సా
హాకాంక్షితనై యుండెద
నీయడుగఁ గొనుచు మగిడి యేగుము తల్లీ. ఆ.వ.

చ. వలసిన సెట్టి కార్యమును వారిరి సెట్టుఁగనైనఁ జేయఁగా
వలఁతి వృకుం బరీక్షితుని వత్సలతం బ్రదికించె శౌరి యొ
క్కలమున యాదవుల్ పెనఁగఁగాఁ గవి మాన్పెఁ దుపేక్ష సేసె నీ
పౌలి యీ టవశ్యభావ్యమని బుద్ధిఁదలఁచుట గానవయ్యెడున్. మౌ. ప.

చ. తినవు దొలంగ కిల్లు సుకృతంబుల పెంపున వచ్చితి వ్రతం
బునకు మహాత్మ! యిచ్చటను బోవదు నీమనిఁ జూపి మర్త్యసం
బనుపడియున్న నెయ్యము భాపదులన్ శుభదృష్టిఁ జూడుమా
మమలను సిద్ధులంపగు నెమ్మంటనటి చందమునొందియుండఁగన్ మ. ప్ర.

ఉ. భారతమూర్తితో వినిన భక్తిఁ బఠించిన శ్రీయు వాయువున్
భూరియశంబునుం బ్రమవమున్ దృఢవీర్యముఁ గల్గు వారికే
కోరిక లైన వేగ మెనఁగూడు సువృత్తునిఁ గాంచు సద్గురున్
గాంచ మెప్పుఁగాఁ బడయుఁగన్యక ముఖ్యకరుసం కుమారియున్ స్వ. వ

## తిక్కన రచించిన యితర కావ్యములు :

### (౧) విజయసేనము.

తిక్కనామాత్యుఁడు విజయసేన మను ప్రబంధమును రచించెనని యొక ప్రతీతి కలదు. ఈ క్రిందిపద్యములు విజయసేనములోనివని పెదపాటి జగ్గనకవి సమకూర్చిన ప్రబంధరత్నావళిలో నుదాహరించియున్నాఁడు. ఈ రత్నావళిని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులు గారు ప్రకటించియున్నారు. విజయసేనమిప్పు డెచ్చటను గనుపట్టుట లేదు. ఇది యొక ప్రౌఢ కావ్యమని చెప్పుచు శ్రీ చిలుకూరి వీరభద్రరావు గా

రాంధ్రులచరిత్రమున నీ క్రిందిపద్యముల నుదాహరించి యున్నారు. ఈ పద్యములు వారి కెట్లు లభించినవో తెలియదు.

"సీ. ఘనసారకస్తూరికా గంధముల నవ్య
గంధబంధంబులు గలపి కలపి,
కుసుమితవల్లికాలంకృతవీధులఁ జొచ్చి
కని సరోగృహముల మునిఁగి మునిఁగి,
సమధికాహార్యాంగన గీతములతోన
కన్నెతీఁగల కాట కలపి. కలపి,
కుముదకుట్మలకుటీకోటరంబులు దూఱి
యళిదంపతులనిద్రఁ దెలిపి దెలిపి,

గీ. యనుదినమ్ము నవపురాంతికమ్మున గట్టు
వాలు వోలె విప్రవరుఁడు వోలె
నట్టువోలెఁ దాను నచ్చిన చెలి వోలె
మెలయుచుండు మందమారుతంబు.

ఉ. పల్లవపుష్పసంపదలఁ బెంచి వసంతుఁడు కాపుగాకనై
యొల్లవనంబు సంకటము లేకఁగఁ దా రొడికంబు మీఱ న
ట్టిల్లన క్రోలి క్రోలి మలయానిలుఁ డందుఁ బరాగపత్త్రముల్
చల్లఁగఁ జేసె నెత్తికొనఁ బలుత్వము కాముఁడు విచ్చలింపగన్."

విజయసేనము : (ప్రబంధరత్నావళిలోనిది)

ఉ. అల్లనఁ దోఁచె మొత్తి శిఖ నౌదలయేటిజలంబు పుచ్చి సం
ఫుల్లగఁ బాదపీఠము పొంతన యున్న సహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనాకమలసంహతిఁ బ్రోవుగఁ జేయు నట్లు శో
భిల్లగ జానకుండు మదభీప్సితసిద్ధికి నంతు గావుతన.

శా. గీర్వాణాచలసీమ వాత్యొరవన క్రీడాహతంబైన చ
యుర్వీరంధ్రము నంద నంత ఫణిరత్నోదగ్రదీప్తు లుర్వి దృ
క్పర్వంబై పొడగట్టి పెర్చిన మదిం గంటింబు యంచున్ గన
ద్గర్వోన్మీలితనేత్రుఁడై మెఱయు వేదండాననుం గొల్చెదన్.

సీ. పద్మంబులును పత్రపద్మాగ్రప్రతి
బింబములును తగ జొరసి మెఱయఁ
గల్లోలములును రంగత్పద్మరాజిత
తుండములును పటు తొట్రుపడఁగ,
బిసములు విహారణరసపమాగతరసా
తలనాగ శిశువులు చెలిమి సేయఁ
జక్రియుగ్మంబులు జలకేలిలోలని
తంబినీస్తనములు తలఁబడంగ

గీ. సాంద్రమైన నట్టిపెంపును గంభీర
తయును బరపులొప్పు పెద్దకొఁది దగిలి జనులు
సంస్తుతింప సఖలసన్నివేశస్థితి
నప్పురంబు పరిఖ యతిశయిల్లు.

చ. తరుణుల తీఁగుఁజన్నుఁగవ తాఁకుచు మన్మథచక్రవాకబం
ధురగతి లీలఁ గామినుల తోరపుటూరుల ఘట్టనంబులన్
కరివరహస్తకాండపటుపుట్టనలన్ బలిఖాతిరంగముల్
దిరుగుడు పద్మతీరములఁ దెట్టువుగట్టు సరోజరేణువుల్.

ఉ. కానిరొద మున్న బందగుబు కోటులకమ్మదు; రమ్యతం బూని తె
చ్చిన పర కొంత పెద్దవెల చెప్పినఁ గొంత్రు తగంగ నిచ్చి; న
చ్చిన వెలతీర్చి లక్ష్మి తమ దిప్పినయట్టుల చేయు సాంపు పే
ర్కొన గణుతింప రాదు; పురకోమటులం బ్రణుతింప నొప్పదే?

క. కిసలయాకారశ్రీబినబిం
బసుధాంశుప్రాయవస్తు బహువిధరూపో
ల్లసము మద మడువ నజుఁడౌక
యసమాకృతి దాల్చె నసఁగ సంగన యొప్పన్.

సీ. మదనవశీకార మంత్రదేవత దృష్టి
గోచరమూర్తిఁ గైకొనెనొ నాఁగ?
సితకరబింబ విస్సృతసుధాధారే వి
లంబనీరూపంబు దాల్చె నాఁగ?
విధి కామినీశ్రేష్ఠ విజ్ఞానవసీమ
భ సురతను లీలఁ బడసెనాఁగ?
శృంగారనవరస శ్రీవిలాసోన్నతి
సుందరాకారంబు నొందెనాఁగ.

గీ. కాక యొకకఘూటికడుపునఁ బుట్టిన
భామ కేల గుట్టిరామణీయ
కంబు కలుగుననుచుఁ గన్నిరుపై వహి
పాలసుతుఁడు దృష్టిఁ గలుపవర్తి.

సీ. అరిమానసమ్ములు దరికొనిరేర్పు నె
వ్వని యుజ్జ్వలాకార వైభవంబు?
బంధులలజ్జానతిఁ బొందునట్లుగఁ జేయు
నెవ్వని పాండిత్య మొసకఁ మెసఁగ?
కొట్టిమాన్యుల నైన నెవ్వఁ వితరణం
బులు వ దిజనుల చాపల మొనర్పు?
వనితాజనము మానభవముఁ గోల్పుచ్చు వి
చ్చలపడి నెవ్వాని విలసనంబు

గీ. అటి విజయసేను నభిరామమూర్తి వి
ద్యావిరూఢమతి వదాన్యవరుఁడు
మధురవిభవైకనిధి యను జగమెల్ల
నతఁడు చిత్రగుణుండుగఁ దగులు.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తుల నశేయుండై పరీక్షించి సన్
దీక్షావ్యగ్రుఁడు గాక విగ్రహముతో దేశంబుఁ గాలంబు సం
పత్సామగ్ర్యముఁ జూపి శక్యము దేసన్ ప్రారంభియై భూప్రజా
వాత్సల్యార్ద్రమనస్కుఁ డై నృపతి శశ్వల్లక్ష్మీసమేతుండగున్.

క. పరధన పరాంగనాజన
పరిహారము ధర్మపథ మందును స
త్పురుషులు వాఱవక వీరిం
బఱికింపుము విసుకు వెఱపుడు పైశున్యంబున్.

గీ. మహిమ చెడదు స్వామ్యమాత్య సుహృత్కోశ
రాష్ట్రదుర్గబల పరాయణులకు
నీవు విదియు నెఱిఁగి కావింపు సప్తాంగ
సంగ్రహంబు నీతిశాస్త్రనిపుణ.

ఈ క్రింది సీసపద్యము తిక్కన విజయసేనము లోనిదని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు.

సీ. అమ్మదనసిఁ బద్మాత్ముకౌస్తుభ మైన
చెలువక గొనియాడి చెప్పుగలిగి
విలువ యిచ్చెదమని వేఁడినఁ బలిజూచ్చుఁ
గమ్మఁసిండియు నమ్మగలిగి
చేవస్తు కొంత ప్రొద్దెండఁబు చనుడెంచి
కొంతటఁ దిగిన నెదురఁ గలిగి

తమయింట లేనివస్తువు లర్థపతియింట
నైన వెదకిన లేవనుట గలిగి

గీ. తమకులాచార వర్తన(?)ము తొలఁక
నంగడుల నొప్పువరుస బేహారుమాట
గాని లాభమునకు గా దనంగ
వఱలుదురు పురవరమున వైశ్యవరులు.

ఈ పద్యమును బ్ర. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తమ ప్రబంధరత్నావళి పీఠికలో నుదాహరించుచు, పై పద్యములలో నొకటి వైశ్యవర్ణన మున్నది ఇదియు వైశ్యవర్ణనమే. రెండు పద్యములును విజయసేనమునందలివే యగునని శంకించినారు. పై పద్యములలో గణపతిస్తోత్రము రెండుపద్యములలో నున్నది. పరిఖావర్ణనము రెండు పద్యములలోఁ గన్పట్టుచున్నది. జగ్గనకవి సమకూర్పులో నేదైన పొరపాటు జరిగెనో? లేక తక్కనయే యట్లు రచించెనో? చెప్పఁజాలము. చిమ్మపూడి అమరేశ్వరుఁడను మహాకవి విక్రమసేన మను నొక ప్రబంధమును రచియించియుండెను. అందలి నాయకుఁడు విక్రమసేనుఁడు. నాయిక విషయము?. తిక్కన విజయసేనములోని నాయకుఁడు విజయసేనుఁడు. నాయికపేరు లభింపలేదు. ఈ గ్రంథముల నామాక్షరములలో రెండవ మూఁడవ యక్షరములు దక్కఁ దక్కినవి సమానము లగుటచే జగ్గకవి గ్రంథనామముల నిచ్చుటలో పొరపాటు పడియె నేమో!

అప్పకవియును, కస్తూరిరంగకవియును, నీక్రిందిపద్యము విజయసేనములోని దని సంశయాస్పద యతికి లక్ష్యముగా నిచ్చియున్నారు.

ఉ. వల్లభుఁ డేఁగు దుర్లభుఁడు వాని దెసం దగులూఁది యిమ్మెయిం
దల్లడ మందెదేల యుచితస్థితికి న్మనుఁబోఁ జూపినన్

